1) జనులార శ్రీరామ జయరామ రఘురామ రామశౌరియని
పలుకుడీమాటా

2) ఘనశాస్త్రములనెల్ల గాలించినను దీనికంటె లేదిక
మంచిబాటా ||జను||

3) తేప తేపకు బుద్ధి దిటవుకావించి అనుదినము జేయుము
రామసేవా

4) పాపంబులను మహాప్రబల వారాశి దరిపట్టింపగా దొడ్డనావా
||జను||

5) సంసారమును నమ్మి సంపాదనలు చేయ శ్రమలు చేయు
వారలున్నా

6) కంసారి ఆజ్ఞయై కదలిపోయెడి నాడు కానరాదది పట్టిసున్నా
||జను||

7) బ్రతికినన్నాళ్ళు మన భార్యాకుమారులని భ్రమలతో
మీరలమటింపా

8) ముదిమతో మంచాన మూల్గునప్పుడు వారు ముందు
దీయుదురు మీ కొంపా ॥జను॥

9) అత్తరులుపూసి తమ అందమును వీక్షించి అదరి పడనేల
పొగరెత్తి

10) చిత్తమును సూటిగాచేర్చి పరికింపు మిది చేవ లేనట్టి తోల్తిత్తి
॥జను॥

11) కడు దుష్కృతము లెన్నో గావించియును మూటకట్ట
నేమిటికిరా డబ్బా

12) అడుగులోనే మిమ్ము అల్లిబిల్లిగ జేసి అంతుండదది
సీటిమబ్బా ॥జను॥

13) ఇల పూడివాడిలో వెలయు శ్రీ వైకుంఠ నిలయుడే
గతి యంచు నమ్మా

14) కలలోననైన మిమ్ము కదిలింపగా రారు కాలకింకరపాళి
బొమ్మా ॥జను॥

15) విష్ణుదాసుని మాటవేగమే ఆలించి విడువు డీ మానసపుమత్తుం

16) కృష్ణగోవింద హరి కేశవ ముకుంద అనికీర్తింప ముక్తి
మీసొత్తుం ॥జను॥